# ఇచ్ఛాశక్తి

## మహాలక్ష్మి (మొదటి భాగము)







# శ్రీ మాతా శ్రీ మహారాజ్ఞీ శ్రీ మత్సింహాసనేశ్వరీ

## శ్రీ లలితా సహస్ర నామావళి వ్యాఖ్యానము

(అత్యంత సులభశైలిలో)

మూడు భాగములలో

వేయి నామముల వ్యాఖ్యానము, వేయి నూట పదహారు చిత్రములు, మహాస్తోత్రనిధి

(రెండు భాగములు పూర్తి రంగులలో)

పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రేనమః

# శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరి

## శ్రీలలితా సహస్ర నామావళి వ్యాఖ్యానము

(అత్యంత సులభశైలిలో)

## ఇచ్ఛాశక్తి

(మొదటి భాగము)

వేయి (ఈ భాగములో 500) నామములకు వ్యాఖ్యానము

అమ్మవారి వేయి (ఈ భాగములో 500) నామములకు

(మొత్తం 1116) వర్ణ చిత్రములు

గ్రంథకర్త:

పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం



శ్రీలలితా మహాత్రిపురసుందరీ ధ్యానపీఠము

గంగాపూర్, ముండరిగి తాలూకా

గదగ్ జిల్లా, కర్ణాటక - 582118

7702090319

ఈ pdf లో అక్కడక్కడ వివరాలు
తెలియడానికి మాత్రమే ఈయబడినవి.
గ్రంథము ఇలా ఉంటుందని
తెలియజేయుటకు
మాత్రమే ఈ ప్రయత్నము.

# శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ

ప్రథమ ముద్రణ:
2023

ప్రతులు : 1200



**రచన, డి.టి.పి మరియు కలర్ గ్రాఫిక్స్: గ్రంథకర్త (పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం)**

ప్రాప్తిస్థానము:
శ్రీలలితా మహాత్రిపురసుందరీ ధ్యానపీఠము
గంగాపూర్, ముండరిగి తాలూకా
గదగ్ జిల్లా, కర్ణాటక - 582118
7702090319, 9505813235





# మాతా పితరులకు వందనం

జన్మనిచ్చి. భూమిమీద పడిన తరువాత అడుగు శరీరం నుండి ఆరడుగుల శరీరం పెరిగే వరకూ పోషించి, విద్యాబుద్ధులు నేర్పించి నన్ను ప్రయోజకుడిని చేసిన అమ్మానాన్నలకు మనస్ఫూర్తిగా అంకితమిస్తున్నాను.

ఎనిమిది నెలలు(1977లో) తన పాదసేవాభాగ్యంతో నన్ను పునీతుని జేసిన జిల్లెళ్ళమూడి అమ్మ నాకు సాక్షాత్తు పరమేశ్వరీ స్వరూపము. ఆ పరాత్పరికి పాదాభివందనములు చేయుచున్నాను.

ఆ తల్లి నామ మంత్రం:-

## జయహో మాతా శ్రీఅనసూయా
## రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి




# జిల్లెళ్ళమూడి అమ్మ
# (మాతృశ్రీ అనసూయాదేవి)



# గురువందనం

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురు స్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః**

మహాగణపతి, బాలాత్రిపురసుందరి, శక్తిపంచాక్షరీ, పంచదశీ మంత్రోపదేశము, ప్రసాదించినవారు, నా రచనా ప్రవృత్తికి మార్గదర్శకులైన వారు, కుర్తాళం మౌనస్వామి వారి ప్రియశిష్యులు, నాతొలి గురువర్యులు అయిన కీ.శే కొండాకోటయ్య మహనీయులకు ఈ గ్రంథమును అంకితము చేస్తున్నాను.



# గురువందనం

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురు స్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః**

ఆంగ్లభాషలో అనర్గళ వాక్పటిమను ప్రసాదించినవారు, నా జీవన వృత్తికి మార్గదర్శకులైన వారు, శ్రీకుర్తాళం మౌనస్వామి వారి ప్రియశిష్యులు, నా తొలి గురువర్యులు అయిన కీ.శే శ్రీకొండాకోటయ్య మహనీయుల కుమారులు కీ.శే శ్రీ కొండారామనాథ రావు గారికి ఈ గ్రంథమును మనస్ఫూర్తిగా అంకితము చేస్తున్నాను.

# ఇచ్ఛాశక్తి (మొదటి భాగం) లో



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే

గజాననం భూతగణాధి సేవితం
కపిత్థం జంబూ ఫలసార భక్షణమ్
ఉమాసుతం శోకవినాశ కారణం
నమామి విఘ్నేశ్వర పాదపంకజం









గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుదేవో మహేశ్వరః

గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః



సిందూరారుణ విగ్రహాం త్రినయనాం మాణిక్య మౌళిస్ఫురత్

తారానాయక శేఖరాం స్మితముఖీమాపీన వక్షోరుహామ్

పాణిభ్యామలిపూర్ణరత్న చషకం రక్తోత్పలం బిభ్రతీమ్

సౌమ్యాం రత్నఘటస్థరక్తచరణాం ధ్యాయేత్పరామంబికా

పలికెదనమ్మా నినునే
పలికిన ప్రతిపలుకున తొలిపలుకై యెపుడున్
పలికిన పలుకులు క్రమమై
పలువురి మన్ననలనంద పలుకుము తల్లీ

# తొలిపలుకు

## శ్రీమాతా! శ్రీమహారాజ్ఞీ! శ్రీమత్సింహాసనేశ్వరీ!

అఖిలాండేశ్వరి, శివశక్త్యైక్యస్వరూపిణి అయిన శ్రీలలితా మహాత్రిపురసుందరి పాదారవిందములకు అనేకానేక సాష్టాంగ ప్రణామములు చేయుచూ **శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ** యను శ్రీలలితా సహస్రనామ వ్యాఖ్యాన గ్రంథమునకు నాయొక్క **తొలిపలుకు** అనే పుష్పాన్ని ఆ తల్లి పాదాలకు సమర్పిస్తున్నాను.

నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరబ్రహ్మస్వరూపమే శ్రీలలితా పరమేశ్వరి. పరమేశ్వరుడు బిందురూపుడైతే ఆ పరమేశ్వరి త్రికోణరూపిణి. పరమేశ్వరుని శక్తియే శక్తిస్వరూపిణి అయిన పరమేశ్వరి. సృష్టికార్యము నిర్వహించాలని పరమేశ్వరుడు సంకల్పిస్తే బయల్వెడలిన శక్తియే పరమేశ్వరి. ఈ పరమేశ్వరికి పరాశక్తి యని, శ్రీలలితామహాత్రిపురసుందరి యని, రాజరాజేశ్వరి, కామేశ్వరి ఒకటేమిటి కోటానుకోట్ల నామములు అన్నియూ ఆ పరమేశ్వరివే అయి ఉన్నవి. సృష్టిలో ప్రతి ప్రాణికి మూలం అమ్మ. యావత్ సృష్టికి మూలం అమ్మ. అందుకే ఆ పరమేశ్వరిని **శ్రీమాతా** యని శ్రీలలితా సహస్రనామావళిలో ప్రప్రథమ నామంగా వశిన్యాది వాగ్దేవతలు చెప్పారు. ఆ శ్రీమాతను గురించి మనం తెలుసుకునే విషయాన్నే **శ్రీవిద్య** యని అన్నాము.

శ్రీవిద్య అంటే.... మంత్రశాస్త్రంలోని స్త్రీదేవతల కోసం చెప్పే మంత్రాలను **విద్య** యని అన్నారు. అటు వంటి శ్రీవిద్యాసారమే నేటి జన బాహుళ్యంలో విస్తృత ప్రచారంలో ఉన్న **శ్రీలలితాసహస్రం.** శ్రీలలితామహా త్రిపురసుందరిని కీర్తించే శ్రీలలితా సహస్రమునే శ్రీలలితా సహస్రనామ స్తోత్రమని అన్నారు. శ్రీలలితా సహస్రనామముల యొక్క చరిత్ర వ్యాసమహర్షి వ్రాసిన అష్టాదశ పురాణముల యందలి బ్రహ్మాండపురాణము లోనిది. శ్రీలలితాసహస్రనామములు బ్రహ్మాండపురాణమునందు, ఉత్తరఖండములో శ్రీలలితోపాఖ్యానములో మూడు అధ్యాయములుగా ఉన్నది. అందు మొదటి అధ్యాయము పూర్వపీఠిక అయితే రెండవ అధ్యాయము శ్లోకములుగా నిక్షిప్తమైన శ్రీలలితా పరమేశ్వరి యొక్క సహస్రనామములు. ఇక మూడవ అధ్యాయము శ్రీలలితా సహస్ర నామస్తోత్ర మహాత్మ్యమును వివరించే ఫలశ్రుతి.

**దేవునికి మానవుని రూపమా? లేక మానవునికి దేవుని రూపమా?**

పరమాత్మకు స్థూలము, సూక్ష్మము, కారణము అని మూడు స్వరూపములు. అందులో స్థూలరూపమే ఇచట ప్రస్తావించడం జరుగుచున్నది. మానవునికి రెండు చేతులు, రెండు కాళ్ళు, తల, మొండెము అని వివిధ అంగములతో ఒక శరీరము ఉన్నది. అలాగే దేవునికి కూడా. కాకపోతే అదనంగా నాలుగు, ఎనిమిది, వెయ్యి....ఇంకా అనంతము అంటూ చేతులు, కొన్ని సందర్భాలలో తలలు కూడా చెబుతూ ఉంటాము. ఏదైనా దేవుడు, మానవుడు కూడా ఒకటే రూపము.

**అయితే దేవునికి మానవుని రూపమా? లేక మానవునికి దేవుని రూపమా?** అంటే...

మానవునికే దేవుని రూపము. దేవుని వలెనే మానవునికి కూడా కాళ్ళు, చేతులు, తల, మొండెము ఉంటాయి అని చెబుతూ ఉంటాము. ఆత్మ... దేవునికి ఉన్నది. అది పరమాత్మ అయితే, మానవునికి ఉన్న ఆత్మ జీవాత్మ. ఇంకోవిషయం ఏమిటంటే దేవుడు తనుకూడా ప్రతీజీవిలోను తన ఆత్మస్వరూపాన్ని ప్రతిష్ఠించుకున్నాడు అని కూడా చెబుతాము. ముఖ్యంగా మానవునిలో ఉన్న ఆత్మ **జీవాత్మ** అయితే, ప్రతిష్ఠింపబడిన దేవుని ఆత్మ **పరమాత్మ** అని అంటాము. అంటే మానవ జన్మ జీవాత్మ, పరమాత్మల కలియికతో ఏర్పడినదని ఆది శంకరులు చెప్పిన అద్వైతమతం తెలియజేస్తోంది. ఈ జీవాత్మ పరమాత్మలు ఉండడానికి ఒక ఉపాధి కావాలి. ఆ ఉపాధినే శరీరము అన్నాము. పంచభూతములున్నది ఒకటి బ్రహ్మాండమయితే, పాంచభౌతికమైన పిండాండమే ఈ శరీరము .

అందుకే మానవ జన్మ ఉత్తమమైన జన్మ. కాని దేవుడు తనకు మానవునికి భేదం పెట్టాడు. మానవునికి మనసున్నది. దేవునికి కూడా మనసున్నది (**మనోరూపేక్షు కోదండా** అని అమ్మవారిని స్తుతించాము. అనగా అమ్మవారి మనస్సు చెఱకువలె మధురమైనది). కాని మానవుని మనస్సుకు శత్రువులు ఉన్నారు. ఆ శత్రువులను అంతఃశత్రువులు అని లేదా అరిషడ్వర్గములు అని చెబుతారు. ఈ అరిషడ్వర్గముల ప్రవర్తనాస్థాయి మానవునిలో ఎంత ఉండాలో నిర్ణయించేది పరమాత్మ. ఆ స్థాయి ఆ జీవాత్మయొక్క గత ఉపాధిలద్వారా (జన్మలద్వారా) చేసిన కర్మఫలాన్ని అనుసరించి ఉంటుంది. కర్మఫలం అనేది మనసుతో ముడిపడి ఉంటుంది. మనసుతో ముడిపడిన కర్మఫలాన్ని అనుసరించి ఈ జన్మలో జీవాత్మ ఇంకా కర్మలు చేస్తూ ఉంటాడు.

ఏదైనా, ఎలా చెప్పినా మానవ జన్మ ఉత్తమోత్తమమైనది. ఎందుకంటే మానవుడు అరిషడ్వర్గాలను ధిక్కరిస్తే దేవుడితో సమానుడౌతాడు. అంటే తనలో పరమాత్మను నిరంతరము కనులు మూసుకుని ధ్యానించాలి. కనులు తెరచి ఉంటే కలి కనిపిస్తుంది. కనులు మూసుకుని, కనురెప్పల తెరలపై దేవుని చిత్రించుకుని సర్వం మరచి సమాధిలోనికి వెళితే అది ధ్యానమౌతుంది. అటువంటి ధ్యానమునకు మించిన అర్చనలు లేవు. నిర్మలధ్యానంతో అంతశ్శత్రువులను రూపుమాపితే జీవాత్మకూడా పరమాత్మ అవుతాడు. అప్పుడు మానవుడే మాధవుడవుతాడు.

భోగి యోగి కానేరడు, యోగి భోగి కానేరడు. ఇది సర్వసాధారణంగా వ్యవహరించే **పెద్దల మాట.** భోగము అంటే ఇహము. యోగి కోరేది పరము. అంటే మోక్షము. ఇహపరములలో ఒకటి కావాలంటే రెండవది అసాధ్యము. కాని ఇహపరదాయకమైనది శ్రీలలితాసహస్రనామస్తోత్ర పారాయణము. ఇది పూర్ణాదీక్షా పరుల నుండి సామాన్య భక్తుల వరకు అంగీకరించిన అంశం.

అటువంటి శ్రీలలితా సహస్ర నామాల ఆవిర్భావం పూర్వపీఠిక అనే ప్రథమోఽధ్యాయంలో వివరించడం జరిగింది. అందుకే పూర్వపీఠికలోని శ్లోకములు తాత్పర్యసహితంగా మాత్రమేగాక తాత్పర్యంలోని అంతరార్థంతో ఈ గ్రంథంలో వివరించడం జరిగింది.

ద్వితాయోఽధ్యాయంలో శ్రీలలితా పరమేశ్వరిని కీర్తించే సహస్రనామములు శ్లోకముల రూపంలో ఉన్నవి. శ్రీలలితా సహస్రనామములు సాక్షాత్తు శ్రీలలితా పరమేశ్వరి తానుగానే తన అంశ నుండి వెడలిన వశిన్యాది వాగ్దేవతలచే వ్రాయించుకున్నది. అమ్మవారు వశిన్యాదులతో ఇలా చెబుతూ తన సహస్రనామములు వ్రాయమని ఆజ్ఞాపించినది:

**మచ్చక్రస్య రహస్యజ్ఞా మమ నామపరాయణాః**
**మమ స్తోత్రవిధానాయ తస్మాదాజ్ఞాపయామి వః**

ఓ వశిన్యాది వాగ్దేవతలారా! మీరు నా శ్రీచక్రముయొక్క రహస్యములు బాగుగా తెలిసియున్నవారు. నా నామపారాయణమందును ఆసక్తి యుండినవారు. గనుక నాయొక్క సహస్రనామములను మీరు మాత్రమే వ్రాయగలరు.

వశిన్యాదులు అంతటి వారు గనుకనే శ్రీలలితా సహస్ర నామస్తోత్రము ఒక్క స్తోత్రముగా మాత్రమే కాదు. శ్రీవిద్యారహస్య భాండాగారము గాను, ఒక శాస్త్రముగాను, శ్రీవిద్యోపాసన యను పూలబాటపై మనను నడిపించే **శ్రీవిద్యాసారథి** గాను అమ్మవారిని కీర్తిస్తూ వ్రాశారు. శ్రీలలితా సహస్రనామముల అర్థము తెలిసిన వారు సకల శాస్త్రపారంగతులు అవుతారు. ఎందుకంటే శ్రీలలితా సహస్రనామములు బ్రహ్మాండ పురాణము లోనివి. బ్రహ్మాండ రహస్యములన్నియు నిక్షిప్తమై యున్నవి. పరబ్రహ్మస్వరూపిణి అయిన శ్రీలలితా మహాత్రిపురసుందరి చరితము సంపూర్ణముగా శ్రీలలితా సహస్రనామములందు ఉన్నది.

వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌళిని అనేవారే వశిన్యాది వాగ్దేవతలు. వీరు అమ్మవారి నుండి వెడలిన తెల్లని కిరణములనుండి ప్రాదుర్భవించినవారు.

అంతటి వశిన్యాది వాగ్దేవతలు తొలుత అయిదునామాలలో అమ్మ వారు ఎలా ప్రాదుర్భవించిందో తెలియజేశారు. తరువాత అమ్మవారి స్థూలరూపం, సూక్ష్మరూపం వర్ణించారు. పంచదశీ మంత్రమే అమ్మవారి సూక్ష్మరూపంగా చెప్పారు. అమ్మవారి సూక్ష్మరూపమును శ్రీవిద్యా మంత్రమైన పంచదశితో సమన్వయించారు. అమ్మవారి స్థూలరూప వర్ణన చేయునపుడు ఆ తల్లి అంగాంగములను వర్ణించిన తీరు, తీసుకున్న పోలికలు ఆ నామముల వ్యాఖ్యానం చదివితే ఆధ్యాత్మిక తాదాత్మ్యంలో తన్మయమవడం తథ్యం. అమ్మవారి శ్రీచక్ర వర్ణన, అర్చనచేసే విధానము, షట్చక్రాల వివరణ, భండాసురవధ, శక్తిసేనల వివరములు ప్రత్యక్షముగా తెలిస్తే పరోక్షముగా శాస్త్రబద్ధమైన అంశములు, ఉపనిషత్సారము, అష్టాదశ శక్తిపీఠముల చరిత్ర ... ఇలా ఎన్నో... ఇంకెన్నో. చెప్పుకుంటూ పోతే మొత్తం శ్రీలలితా సహస్రనామ వివరణ ఇక్కడే పూర్తయిపోతుంది.

ఇన్ని వివరములు మనకు తెలిశాయంటే దానికి కారణం భాస్కరరాయలు వారు. భాస్కరరాయలు వారు **భాసురానందనాథ** యను దీక్షానామం కలిగిన పూర్ణదీక్షాపరుడు. భాస్కరరాయలు వారి గురించి తరువాత పుటలలో ప్రత్యేకముగా వివరించడము జరిగినది. వారు వ్రాసిన **సౌభాగ్యభాస్కరం** అను గ్రంథమే నేను వ్రాసిన ఈ వ్యాఖ్యానానికి మాతృక. ఇంకనూ చెప్పాలంటే గురుతుల్యులైన ఎంతోమంది పండితులు, శ్రీవిద్యోపాసకులు, ప్రవచనకర్తలు అందరూ నాకు మార్గదర్శకులే. వారికి నా వందనములు.

తొలుత నా తొలిగురువులు, కుర్తాళం పీఠాధిపతి శిష్యులు అయిన కీ.శే శ్రీ కొండాకోటయ్య గారిని మనస్ఫూర్తిగా తలచు కుంటూ కుర్తాళం ప్రస్తుత పీఠాధిపతులయిన శ్రీసిద్ధేశ్వరానంద భారతీ స్వామివారికి, శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వాములవారికి పాదాభి వందనములాచరిస్తూ ఈ వ్యాఖ్యాన గ్రంథమును ఆ పరమేశ్వరి పాదములకు అంకితమిస్తూ మిత్రులకు తత్ప్రసాదంగాఅందిస్తున్నాను.

సుమారు ఐదు సంవత్సరములకు పైగా ఆ పరమేశ్వరి నాకు అనుగ్రహించిన జ్ఞానసంపద మేరకు ప్రతీరోజూ శ్రీలలితా సహస్రనామావళిలోని నామములకు వివరణను వాట్సాప్‌లో ఎంతోమంది మిత్రులకు అందిస్తూ వస్తున్నాను. చాలా మంది మిత్రులు ఈ వివరణను గ్రంథరూపంలో వెలువడజేయమని నన్ను ప్రోత్సహించారు. ఆ ప్రోత్సాహం ఆ పరమేశ్వరి ఆదేశముగా భావించి వ్యాఖ్యాన గ్రంథమునకు మొత్తం DTP నేనే తయారు చేసుకుని ముద్రణకు సిద్ధమయాను. ప్రతీ నామమునకు శ్రీలలితా మహాత్రిపురసుందరి చిత్రములు కూడా గ్రంథములో ఉంచాలని సంకల్పించాను. అమ్మవారి చిత్రములు రంగులలో ఉంటాయి గనుక మొత్తం గ్రంథమును రంగులలో ముద్రించాలని నిర్ణయించడమయినది.

ప్రతీనామమునకు ఇచ్చిన అమ్మవారి చిత్రము ఏదో ఒకటి ఇంటర్ నెట్ నుండి నేరుగా తీసుకోవడము కాకుండా, తీసుకున్న చిత్రమును కావలసినవిధంగా మలచుకుని, నామములోని భావమునకు తగిన విధంగా రూపుదిద్దడమైనది. మందార, చేమంతి, మల్లె, సంపెంగ పూవులయొక్క చిత్రములను తీసుకుని వాటితో అమ్మవారి చిత్రములకు Frames ఏర్పరచాను. ఆ Frames పై బిల్వపత్రములు, శంఖములు, ఓం కారములు మధ్యమధ్య అలంకరించాను. అమ్మవారి చిత్రములు అన్నీ ఫోటోలవలె ఉండాలి గనుక ప్రతీ ఫొటో కూడా ఫొటోఆర్ట్ పేపరుపై ముద్రించాలని, ఫొటోతో బాటు మొత్తం గ్రంథం ఆర్ట్ పేపరుపై ముద్రింపజేయుట జరిగినది.

**శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ** యను ఈ శ్రీలలితా సహస్రనామ వ్యాఖ్యన గ్రంథమును **ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి** యని మూడు సంపుటములుగా విభజించడమైనది. ఈ మూడు సంపుటములు బ్రహ్మాండపురాణము, ఉత్తరఖండంలోని శ్రీలలితోపాఖ్యానము యొక్క మూడు అధ్యాయములలోని మూడువందల ఇరవై శ్లోకములను (ఈ శ్లోకముల వైనము తరువాయి అధ్యాయములలో తెలుసుకోగలము) పారాయణ క్రమము ననుసరించి వ్యాఖ్యానముగా చెప్పడమైనది.

క్లుప్తముగా వివరించవలసి వస్తే **ఇచ్ఛాశక్తి** యను ప్రథమ సంపుటములో దైవమును, గురువులను, పితృదేవతలను స్మరిస్తూ భాస్కరరాయలు వారిని తలచుకున్నాను. పిదప శ్రీలలితాసహస్రనామ స్తోత్రములోని పూర్వ పీఠిక యనే ప్రథమాధ్యాయము నందు శ్రీలలితా సహస్రనామ స్తోత్ర ఆవిర్భావము చెప్పడమైనది. తరువాత శ్రీలలితాసహస్రనామ స్తోత్రములోని రెండవ అధ్యాయములోని శ్రీలలితా పరమేశ్వరి యొక్క సహస్రనామావళి లోని ప్రథమార్థము యొక్క ఐదు వందల నామములను, ప్రతీ నామమును ఒక నామంత్రముగా భావిస్తూ, వ్యాఖ్యానము చెబుతూ, నామములోని భావమునకు తగినవిధంగా అమ్మవారి చిత్రమును సమర్పించడమైనది.

ఇక **జ్ఞానశక్తి** యను రెండవ సంపుటములో శ్రీలలితాసహస్రనామ స్తోత్రములోని రెండవ అధ్యాయములోని శ్రీలలితా పరమేశ్వరి యొక్క సహస్రనామావళి లోని ద్వితీయార్థములోని మిగిలిన ఐదు వందల నామములను కూడా ప్రతీ నామమును ఒక నామమంత్రముగా భావిస్తూ, వ్యాఖ్యానము, నామములోని భావమునకు తగిన విధంగా అమ్మవారి చిత్రమును సమర్పించడమైనది.

తదుపరి **క్రియాశక్తి** యను మూడవ సంపుటము కేవలం పారాయణగ్రంథముగా భావించి మూడువందల ఇరవై శ్లోకముల శ్రీలలితా సహస్రనామ స్తోత్రముయొక్క మూడు అధ్యాయములతోబాటు, శ్రీలలితా సహస్రనామములు, శ్రీలలితా అష్టోత్తర శతనామావళి, త్రిశతీ స్తోత్రము, త్రిశతీ నామావళి, ఖడ్గమాలా స్తోత్రము మరియు ఇతర దేవీదేవతల స్తోత్రములు అనుష్ఠాన క్రమంలో స్థూలాక్షరములతో సమర్పించడమైనది.

ఒక్క మాటలో చెప్పాలంటే **శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ** యను ఈ గ్రంథము శాశ్వతముగా తరాల తరబడి చెక్కుచెదరకుండా ఉండేలా నాణ్యమైన కాగితముపై ముద్రణ జరిపి వేయి (1000) నామముల వ్యాఖ్యానము, వేయినూట పదహారు (1116) అమ్మవారి చిత్రములు రంగులలో ముద్రింపజేసి సమర్పించడం జరిగినది.

ఈ (నా) జన్మ ఇంకెన్నాళ్ళో తెలియదు. కాని జన్మ తరించేలా, జన్మజన్మలూ గ్రంథ రూపంలో భక్తుల మనస్సులనే మందిరాలలో విలసిల్లాలనే ఆకాంక్షతో భక్తజనుల ఆదరణే ఆ పరమేశ్వరి అనుగ్రహంగా భావిస్తూ ఈ గ్రంథం రూపొందించడం జరిగినది.

పరమేశ్వరీ స్వరూపులైన భక్తులందరికీ వినమ్రంగా వందనమాచరిస్తూ



సౌభాగ్యభాస్కరం
అను శ్రీలలితా సహస్రనామ భాష్యకర్త
శ్రీ భాస్కర రాయలు వారు

# శ్రీభాస్కరరాయలు వారి చరితము

**గంగా భవానీ గాయత్రీ కాళీ లక్ష్మీః సరస్వతీ**

**రాజరాజేశ్వరీ బాలా శ్యామలా లలితా దశ**

పై శ్లోకం బ్రహ్మాండపురాణంలోని శ్రీలలితోపాఖ్యానంలోని మూడవ అధ్యాయం (ఫలశ్రుతి) లో డెబ్బది ఒకటవ శ్లోకం. కోట్లాది దేవీ సహస్రనామాలలో పై శ్లోకంలో చెప్పబడిన పది దేవీ సహస్ర నామములు ఉత్తమమైనవి. అందులో **శ్రీలలితా సహస్ర నామములు** అత్యుత్తమమైనవి. ఎందుకంటే అవి శ్రీలలితాపరమేశ్వరి నుండి వెడలిన తెల్లని ఎనిమిది కిరణాలలో ప్రాదుర్భవించిన వశిన్యాది వాగ్దేవతలు **(వశిని, కామేశ్వరి, మోదీని, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌళిని అనువారు)** విరచించినవి. శ్రీలలితా సహస్ర నామములలో ప్రతీనామమునందు దాగివున్న (రహస్యముగా ఉన్న) స్పష్టమైన, అంతర్గతమైన, శాస్త్రీయమైన, వేదాంతపరమైన అర్థము, ప్రతీ నామమునకు వివిధకోణములలో వైదికమైన, ఆధ్యాత్మికమైన, తార్కికమైన, నీతిశాస్త్ర సంబంధమైన భావము వివరించుటతోబాటు ఏబది ఒక్క సంస్కృతాక్షరములలో అచ్చులలోను, హల్లులలోను ఎన్ని (32) అక్షరముల ప్రారంభముతో నామములు ఉన్నవి, ఎన్ని (19) అక్షరముల ప్రారంభముతో నామములు లేవు అన్న వివరములు కూడా పొందుపరచబడిన ప్రప్రథమము, అత్యుత్తమము అయిన శ్రీలలితా సహస్రనామ వ్యాఖ్యాన గ్రంథము **సౌభాగ్యభాస్కరం** ఒక్కటే అన్నది అందరికీ తెలుసు. అంతటి మహద్గ్రంథము వ్రాయబడి, వివిధ భాషలలోనికి అనువదింపబడిన గ్రంథనిర్మాత ఎవరంటే - **శ్రీభాస్కరరాయలు** వారు. వారి గురించే మనం ఇప్పుడు తెలుసుకోబోతున్నాము.

ఒకసారి ఆదిశంకరులు శ్రీలలితా సహస్రనామాలకు భాష్యం వ్రాయాలని సంకల్పించారు. అందుకు వారు సాక్షాత్తు వశిన్యాది వాగ్దేవతలు వ్రాసిన శ్రీలలితా సహస్రనామముల ప్రతికోసం తన శిష్యులద్వారా అన్వేషించారు. అంతలో ఒక బాలిక శ్రీవిష్ణు సహస్రనామాలు ఉన్న ప్రతిని తెచ్చి ఇచ్చినది. ఆయన సంకల్పం శ్రీలలితా సహస్రనామాలకు భాష్యం వ్రాయాలని. అందుచే ఆదిశంకరులు తన అన్వేషణను కొనసాగించారు. కాని ఫలితం శూన్యం. ఆదిశంకరులు తన దివ్యదృష్టితో తిలకించగా, శ్రీవిష్ణు సహస్రనామముల ప్రతిమాత్రమే ఇచ్చిన ఆ బాలిక సాక్షాత్తు శ్రీలలితా మహాత్రిపురసుందరియే అనియు, శ్రీలలితాసహస్రనామములకు భాష్యం వ్రాయడానికి ఆయనంతటి మహనీయుడు మరియొకడు ఉన్నాడనియు, ఆయన కోసమే శ్రీలలితాసహస్రనామ వ్యాఖ్యానము వ్రాయు మహత్తర కార్యక్రమము ప్రత్యేకింపబడినది అనియు తనకు అమ్మవారు వివరించినట్లుగా గ్రహించారు. అంతటి ఆ మహనీయుడే **శ్రీభాస్కరరాయలు వారు.** ఆ మహాపురుషుడే అంతటి మహత్కార్యమునకు నియోగింపబడిన కారణపురుషుడు. వారి గురించే ఇచ్చట మనం చర్చించుకోబోతున్నాము.

భాస్కరరాయలు వారి కుటుంబం విశ్వామిత్రగోత్రీకులు. తెలగాన్య శాఖకు చెందిన బ్రాహ్మణులు. వారి ముత్తాత గారు **శ్రీ తుక దేవ**. తాత **యమాజి పండిట్**, నాయనమ్మ **చంద్రమాంబ**. తండ్రి గంభీరరాయలు, తల్లి కోనమాంబ. భాస్కరరాయలు వారి తండ్రి అయిన గంభీరరాయలు బీజాపూరు నవాబు వద్ద మంత్రి. గంభీరరాయలు వారు మహాపండితుడు, అనేక గ్రంథములను రచించారు. అనేక యాగములు చేసిన సోమయాజి. పార్శీభాషలో మహాభారతమును వ్రాసి **భారతి** అనే బిరుదును పొందారు. అంతటితో వారి ఇంటిపేరు కూడా **భారతుల** అని పసిద్ధి పొందినది. ఇప్పటికీ కృష్ణానదీ తీరంలో **భారతుల** యను ఇంటిపేరు గల బ్రాహ్మణ కుటుంబములు ఉన్నవి.

గంభీరరాయలు వారు కొంతకాలము భాగ్యనగరము అనే నేటి హైదరాబాదులో రాచకార్యము నిమిత్తమై నివసించారు. గంభీరరాయలుకు భాస్కరరాయల వారి కన్నా ముందు నారాయణ అని ఒక పుత్రుడు ఉండేవాడు. అతడు చాలా అమాయకుడు. చదువుసంధ్యలయందు చురుకైనవాడు కాడు. తన కొడుకు నారాయణ అమాయకుడగుటచే, భాస్కరరాయలు వారి తల్లి అయిన కోనమాంబ గంభీరరాయలు అంతటి వాడైన ఒక పుత్రుని కోసం సూర్యభగవానుని ఆరాధించినది. సూర్యభగవానుని అనుగ్రహంతో గంభీరరాయలు, కోనమాంబా దంపతులకు భాస్కరరాయలు వారు 26.4.1683 వ తేదీన జన్మించిరి. వారి జన్మనక్షత్రము కృత్తిక, 4వ పాదం. తిథి వైశాఖ శుద్ధ తదియ. ఆరోజు నాలుగు గ్రహములు ఉచ్ఛదశలో ఉన్నవని తెలియుచున్నది. ఆ విధంగా భాస్కరరాయలు వారు క్రీ.శ 1683 లో జన్మించి 1785 వరకూ జీవించినట్లు వారి శిష్యులు వ్రాసిన గ్రంథముల వలన తెలియుచున్నది. గంభీరరాయలు వారు సతీసమేతంగా తమ కుమారుడైన భాస్కరరాయలుతో తీర్థయాత్రలు సేవించుచు కాశీక్షేత్రమునకు చేరిరి. అచటనే భాస్కరరాయలు వారికి ఉపనయన సంస్కారము జరిపించిరి. భాస్కరరాయలు వారికి తెలంగాణా రాష్ట్రంలో ఇప్పటి నారాయణపేట జిల్లా, లోకాపల్లి గ్రామంలో సాక్షాత్తు



# సౌభాగ్యభాస్కరం

గ్రంథకర్త

## శ్రీభాస్కర రాయలు వారి

## జ్ఞాపక చిహ్నాము

## భాస్కరరాజపురము

## (తంజావూరు సమీపం)

సూరత్ నగరము వెళ్ళారు. శివదత్త శుక్లా వారు పూర్ణదీక్షాపరులు. పరదేవతా సాక్షాత్కారమును పొందినవారు. వారి వద్ద గురుకులవాసము చేస్తూ, గురువుగారికి తన శుశ్రూషతో ఆయన అనుగ్రహానికి పాత్రుడై శ్రీవిద్యాపూర్ణదీక్షను స్వీకరించి **భాసురానందనాథ** అనే దీక్షానామమును పొందియుండిరి.

భాస్కరరాయలు వారికి పద్దెనిమిదవ సంవత్సరంలోనే వివాహము అయినది. భాస్కరరాయలు వారికి వివాహం కూడా ఒక విచిత్ర పరిస్థితిలో జరిగినది. మధ్వపీఠాధిపతి అయిన సత్యబోధయతిని వాదమునందు ఓడించి, ఆయన మెప్పును పొంది, అయన సోదరుని కుమార్తె అయిన **ఆనందిని** వివాహమాడడం జరిగింది. భాస్కరరాయలు వారు ఆనంది యందు పాండురంగ అను పుత్రుని పొందారు. భాస్కరరాయలు వారి సంతానం వివరాలు అంతగా తెలియడానికి ఆధారాలు లేక పోయినను, పాండురంగ అను కుమారుడు గాక అంబిక అను కుమార్తె కూడా ఉన్నట్లు తెలియుచున్నది. అలా భాస్కరరాయలు వారి తరువాత వంశము వృద్ధి పొందుచూ తరాలు గడుస్తూ, వారి వంశీకులు బెంగుళూరు, హైదరాబాదులలో ప్రస్తుతం ఉన్నట్లు చెబుతున్నారు.

గురుకుల వాసములో ఒకసారి ద్వైతులు అద్వైతులు ఒకరిపై ఒకరు పోటీ పడ్డారు. ఆ సమయంలో పోటీకి తట్టుకోవడానికి భాస్కరరాయలు వారి గురువు శివదత్త శుక్లా మాత్రమే సమర్థత కలిగి ఉన్నవారు. కాని ఆయన వయసు మీదపడి కదలలేని స్థితిలో ఉండడంచేత, భాస్కరరాయలు వారు గురువు ఆదేశంపై ద్వైతులతో వాదమునకు తలపడి, వారిని ఓడించి గురువుగారికి ఆనందం కలిగేలా విజయకేతనం ఎగురవేయడం జరిగింది. అంతటితో భాస్కరరాయలు వారి గురువు శివదత్త శుక్లా భాస్కరరాయలు వారికి **శ్రీభాసురానందనాథ** అను దీక్షానామమును ఇచ్చారు. అలాగే భాస్కరరాయలు వారి సతీమణికి పూర్ణాభిషేకము చేసి **పద్మావత్యాంబ** అను దీక్షానామమును అనుగ్రహించారు. భాస్కరరాయలు వారు తన ధర్మపత్నీ సమేతంగా శివదత్త శుక్లా గురువుల వారికి వస్త్రములు, దక్షిణ సమర్పించుకున్నారు.

ఇక్కడ ముఖ్యంగా చెప్పవలసినది ఏమంటే భాస్కరరాయలు వారు వారి తండ్రి, విద్యనేర్పిన గురువు, పూర్ణదీక్షను ఒసగిన గురువు – ఈ ముగ్గురు యోగులు. వైదిక నిత్యానుష్ఠాన దీక్షను గలిగినవారు మరియు యజ్వులు. యజ్వులు అనగా విధ్యుక్తముగా యజ్ఞము చేయువారు. గనుకనే సోమయాగమును కూడా చేశారు.

పండితులు, యోగులు, మహాత్ములు ఒక ప్రాంతానికి మాత్రమే చెందినవారు అవరు. ఎందుకంటే వారు లోకులను తరింపజేయడానికి సంచారము చేస్తూనే ఉంటారు. అలాగ భాస్కరరాయలు వారు హిందువు. ఆదిశంకరుల వారితో సమానమైనవారు. అద్వైతచైతన్యోన్నతికి విశేషమైన కృషి సలిపినవారు. భాస్కరరాయలు వారు ఒక యోగి అయి, యజ్వ అయి (యజ్ఞముచేసినవారై) గురువుల ఆజ్ఞప్రకారము తనతోబాటు లోకులను తరింపజేయాలని భారతదేశము అంతయును సంచరించారు. ఇక్కడ ఒక ముఖ్య విషయం నేను **(పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం)** చెప్పాలని **(తమలో కొందరికి తెలియదనిగాదు)** ఆశపడుతున్నాను. ఏమిటంటే భాస్కరరాయలు వారు ఒక చోట ప్రార్థనా శ్లోకంలో **త్రేతా – త్రిపురా – త్రయీ – నాథత్రయిని తలచుచున్నాను** అని ఉన్నది. అనగా ఇక్కడ తండ్రి, విద్యాభ్యాసమొనర్చిన గురువు, పూర్ణదీక్షను ఇచ్చిన ముగ్గురిని గురువులు అని ప్రస్తావించారు. అదేమిటంటే తండ్రి త్రేతాగ్నులు **(గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని అను మూడగ్నులు)** గలవాడగుటచే **త్రేత**గాను, గురువును విద్యాస్వరూపిణి యైన **త్రిపుర**గాను, శ్రీవిద్యాదీక్షను ఇచ్చిన మూడవ గురువును **త్రయీ** రూపముగా తలచుచూ భాస్కరరాయలు వారు యోగి అయారు. భారతదేశమంతా సంచరించారు. అంతేగాక లోకుల అజ్ఞానతిమిరములను తొలగించి అద్వైతజ్ఞానప్రకాశమును అందించిన అపరభాస్కరుడు అని పండితుల మన్ననలకు పాత్రుడయినాడు.

అనేకమంది శిష్యులు ఉండేవారు. పూర్ణదీక్షను స్వీకరించిన తరువాత, తన తండ్రియున్న బీజాపూర్ వచ్చి కొన్నాళ్ళు ఉన్న తరువాత, తన శిష్యులతో దేశమంతా పర్యటించి, అద్వైతచైతన్యమునకు నిర్విరామమైన కృషిచేశారు.

దక్షిణ భారతదేశ పర్యటనలో ఉన్నపుడు భాస్కరరాయలువారికి తంజావూరు రాజు ఒక అగ్రహారమును బహూకరించడం జరిగింది. ఆ అగ్రహారమే తంజావూరు జిల్లాలో, తిరువిడైమరుదూరు తాలూకాలోని నేటి **భాస్కరరాజపురము**. ఈ భాస్కరరాజపురంలోనే భాస్కరరాయలు వారు శ్రీచక్రమేరువును ప్రతిష్టించి నిత్యమూ శ్రీచక్రార్చన జరిగే విధానాన్ని ఏర్పరిచారు. ఇక్కడే వారి జ్ఞాపకచిహ్నములైన వారి గ్రంథములు, వారు ఉపయోగించిన వస్తువులు ఉంచుటకుగాను **భాస్కరరాయ మెమోరియల్** ఒకటి నిర్మింపబడినది.

దక్షిణ భారత దేశంలో రామేశ్వరం, మధురై, అనంతశయనము సందర్శిస్తూ, శృంగేరి శారదా పీఠమునకు చేరారు. శృంగేరీలో నాటి పీఠాధిపతి శ్రీపురుషోత్తమభారతీ స్వాముల వారితో ఆయన చేయబోవు కార్యక్రమముల గురించి వివరించి స్వాముల వారి అనుమతిని పొందడం కూడా జరిగింది. స్వాములవారు భాస్కరరాయలు వారికి ఛత్రము, చామరము ఇంకా వివిధ సామాగ్రిని బహూకరించగా భాస్కరరాయలు వారు

# శ్రీలలితా సహస్రనామ స్తోత్రము

**శ్రీవిద్యాం జగతాం ధాత్రీం సర్గస్థితిలయేశ్వరీమ్**
**నమామి లలితాం నిత్యాం మహాత్రిపుర సున్దరీమ్**

బాలా, పంచదశీ, షోడశీ అనబడు శ్రీవిద్యా మంత్రస్వరూపిణియై విరాజిల్లుచూ,
సకల లోకాలను ధరించినదై, సృష్టిస్థితిలయలు అను త్రికార్యములనూ నిర్వర్తిస్తూ,
నిత్యాకళా స్వరూపిణిగా తేజరిల్లు

**శ్రీలలితా మహా త్రిపురసుందరికి వందనమాచరించుచున్నాను.**

స్తోత్రపారాయణ (ఎన్ని సార్లైనను) చేయునపుడు ఒక్కసారి పూర్వపీఠిక ఏబది శ్లోకములు పారాయణ చేసిన సరిపోతుంది. ధ్యానశ్లోకము మాత్రము స్తోత్ర పారాయణచేయు ప్రతీ ఒక్కసారి పఠించవలయును. అలాగే ఫలశ్రుతి కూడా స్తోత్రపారాయణ అంతయును (అన్నిసార్లు) పూర్తి అయిన పిదప ఒకసారి పఠించిన చాలును.

## లలితా సహస్ర నామ స్తోత్రము ఎలా ఆవిర్భవించినది?

బ్రహ్మాండ పురాణ మంతయును సృష్టి యొక్క ఆవిర్భావానికి సంబంధించినది. అందులో దేవకార్యములన్నియును ఉపాఖ్యానముల రూపంలో చెప్పబడినవి. అట్టి ఉపాఖ్యానములలో లలితోపాఖ్యానము ఒకటి. అగస్త్యుడు శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠుడు. ఈయన సముద్రజలాన్ని మొత్తం ఆపోశన పట్టిన మహనీయుడు. ఆ కథ ఏమనగా – బ్రహ్మ మరీచి, అత్రి, అంగీరసుడు, పులహుడు, పులస్త్యుడు, క్రతు, వశిష్టుడు, ప్రచేతసుడు, భృగు, నారదుడు అను పదిమంది ప్రజాపతులను సృష్టించినాడు. వారిలో మరీచి యొక్క భార్య కాలక. వీరిరువురి పుత్రులే కాలకేయులు. వీరు స్వతహాగా రాక్షసప్రవృత్తి గలవారగుటచే దేవతలను, ఋషులను, బ్రాహ్మణులను, స్త్రీలను హింసిస్తూ ఉండేవారు. కాలకేయుల హింసను తట్టుకొనలేని వీరంతా వైకుంఠము వెళ్ళి శ్రీమహావిష్ణువుకు మొరపెట్టుకున్నారు. కాలకేయులు పగలంతా సాగరగర్భంలో దాగి ఉండి రాత్రివేళలందు మాత్రమే బయటకు వస్తారు. వారిని పట్టుకోవాలంటే సముద్రంలోని జలములనన్నింటినీ తీసివేయవలెను. అప్పుడుగాని వారిని నిర్మూలించడం జరగదు అని శ్రీమహావిష్ణువు దేవతలకు చెప్పడం జరిగింది. సముద్రజలం ఒక్కసారి పానంచేయగల సమర్థుడు అగస్త్యుడు మాత్రమే అనికూడా శ్రీమహావిష్ణువు దేవతలకు చెప్పడం జరిగింది. దేవతలంతా అగస్త్యుని ప్రార్థించగా, అతడు సముద్రజలాన్నంతా ఆపోశనపట్టేశాడు. సముద్రగర్భంలోని కాలకేయులు బయటపడ్డారు. శ్రీమహావిష్ణువు కాలకేయులను సంహరించి దేవతలను, ఋషులను, బ్రాహ్మణులను, స్త్రీలను రక్షించుట జరిగినది. అంతట సాగరజలములు లేకపోవుటచే జలచరములకు ఇబ్బంది కలిగినది. దేవతలు మొదలైనవారు జలములను మరల సాగరములోనికి వదలమని అగస్త్యుని ప్రార్థించగా, ఆయన తన మూత్రద్వారము ద్వారా మరల జలములను సాగరములోనికి వదిలాడు.

అగస్త్యుని గొప్పదనము వర్ణించు పురాణకథ ఇంకొకటి కలదు. వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులు ఉండేవారు. వీరు అడవిలో ఒకచోట నివాసము ఏర్పరుచుకొని ఉండేవారు. బ్రాహ్మణ వేషము ధరించి ఆ త్రోవలో పోవు మునీశ్వరులను తమ ఇంటికి భోజనమునకు ఆహ్వానించేవారు. వారిలో ఇల్వలుడు అనేవాడు తన తమ్ముడు వాతాపిని మేకగా మార్చి, సంహరించి రుచికరమైన కూర తయారుచేసి మునీశ్వరులకు భోజనం పెట్టేవాడు. మునీశ్వరులు భోజనంచేసి విశ్రాంతి తీసుకొను సమయంలో, ఇల్వలుడు "ఒరే వాతాపీ! ఎక్కడున్నావు. బయటకు రారా!" అని పిలిచేవాడు. మునీశ్వరుల కడుపులో ఇంకా జీర్ణం కాకుండా కూరరూపంలో ఉన్న వాతాపి వారి పొట్ట చీల్చుకొని బయటకు వచ్చేవాడు. అంతట ఆ మునులు చనిపోగా, వారి శరీరములను ఇల్వలుడు, వాతాపి ఆరగించేవారు. మునీశ్వరులంతా ఆ రాక్షసుల బారినుండి తమను రక్షించాలంటే అగస్త్యుడు మాత్రమే సమర్థుడని, ఆయనను వేడుకుంటారు. అగస్త్యుడు ఆ రాక్షసులకు బుద్ధి చెప్పాలని, ఆ అడవిమార్గంలో వారిముందునుంచి వెళ్ళాడు. ఎప్పటి వలెనే, ఆ రాక్షసులు అగస్త్యుని తమ ఆతిథ్యానికి ఆహ్వానించారు. ఇల్వలుడు వాతాపిని మేకగా మార్చి, చంపి కూరవండి అగస్త్యునికి ఆతిథ్యమివ్వడం, అగస్త్యుడు భోజనానంతరం విశ్రాంతి తీసుకొనుచుండగా, ఎప్పటివలెనే ఇల్వలుడు "ఒరే వాతాపి! ఎక్కడ ఉన్నావు! రారా!" అన్నాడు. ఈ సారి వాతాపి పలుకలేదు. మళ్ళీ పిలిచాడు. వాతాపి రాలేదు. సరికదా పలుకూ ఉలుకూ లేదు. అగస్త్యుడు మాత్రం ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నాడు. ఇల్వలునికి కంగారు పెరిగింది. "ఒరే వాతాపి! మాట్లాడవేంరా? రారా! రారా! ఆహారం తీసుకుందాము" అని బిగ్గరగా అరిచాడు. ఈ సారి




# శ్రీశివశక్త్యైక్యరూపిణి, లలితాంబిక, శ్రీలలితామహాత్రిపురసుందరి



**శ్రీలలితోపాఖ్యానము ఉన్న శ్రీబ్రహ్మాండపురాణం విరచించిన శ్రీవేదవ్యాస మహర్షి, వ్రాయుటకు సహాయపడిన విఘ్నేశ్వరుడు**


శ్రీలలితాసహస్రనామ ఆవిర్భావాన్ని
అగస్త్యమహర్షికి తెలియజేసిన
శ్రీహయగ్రీవస్వామి


శ్రీవిద్యోపాసక శ్రేష్ఠులు
లోపాముద్రాగస్త్య దంపతులు

అగస్త్యుడు పలికాడు. బిగ్గరగా నవ్వుతూ ఇలా అన్నాడు "ఇంకెక్కడి వాతాపి? నా పొట్టలో జీర్ణమై పోయాడు! ఇంక వాడు బయటకు రాడు!" అన్నాడు. అంతే ఇల్వలుడు తన రాక్షస రూపంతో అగస్త్యుని పాదాలపై బడి క్షమాభిక్ష కోరుకున్నాడు. ఇకపై ఎవరినీ హింసించమని మాట ఇచ్చాడు. తన తమ్ముడు వాతాపిని బ్రతికించమని కాళ్ళపైబడి వేడుకున్నాడు. అంత అగస్త్యుడు వాతాపిని బ్రతికించాడు. ఇకపై ఎవరినీ హింసించ వలదని ఆ రాక్షసులకు అగస్త్యుడు హితవు పలికాడు.

ఒకసారి వింధ్యపర్వతరాజు అత్యంత బలసంపన్నుడు. తన గొప్పతనాన్ని అందరికీ తెలియజేయాలని అకస్మాత్తుగా తన వ్యాప్తిని విస్తరించి, శిఖరాలను ఇంకనూ పైకి ఎత్తుగా జేసి, వివిధ ఫలపుష్పాదులతోను, జలపాతములతోను, లోయలతోను అత్యంతరమణీయంగా మార్చుకున్నాడు.

తెల్లవారింది. సూర్యోదయం కావలసి యున్నది. సూర్యుడు తన సారథి అనూరుడు రథముతోలుతుండగా బయలుదేరాడు. ఎప్పటి వలెనే వింధ్యపర్వతం చేరువలోనికి సూర్యుని రథం వచ్చినది. కాని, సూర్యుని రథం ముందుకు సాగడంలేదు. వింధ్యపర్వతము యొక్క శిఖరములు అడ్డుగా ఉన్నాయి. సూర్యుని రథం కదలడంలేదు. అందుచే రాత్రిం బగళ్ళు ఆగిపోయాయి. పగలు ఉన్నచోట రాత్రి అవడంలేదు. రాత్రి ఉన్నచోట పగలు రావడంలేదు. ఋషులు, బ్రాహ్మణులు తమతమ సంధ్యావందనాది విధులు నిర్వర్తించడం ఆగిపోయింది. లోకాలు తల్లడిల్లిపోతున్నవి. ఆ స్థితిలో దేవతలంతా బ్రహ్మను వేడుకున్నారు. బ్రహ్మ దేవతలను వైకుంఠానికి వెళ్ళి విష్ణుమూర్తితో మొరపెట్టుకోమని చెప్పాడు. విష్ణువుకూడా తన వల్లకాదు. అగస్త్యుడు ఒక్కడే కాలగతిని సరిచేయగలడు అని చెప్పాడు. అంత దేవతలందరూ అగస్త్యుని వేడుకున్నారు. దేవతల మాటను మన్నించి వింధ్యాద్రికి వెళ్ళాడు. తాను కాశీనుండి రామేశ్వరము మొదలైన దక్షిణదేశ యాత్రలు చేయవలెననియు, తాను తిరిగి వచ్చువరకూ కొంచం వంగి ఉండమని కోరాడు. వింధ్యపర్వతరాజుకు అగస్త్యుని గొప్పతనం తెలుసు. అతను చెప్పినది వినకుంటే మొదటికే మోసం వస్తుందని ఇంతకు ముందుగల తన ఎత్తుకంటే మరింత తక్కువగా వంగి అగస్త్యునికి దారి ఇచ్చాడు. కాలగమనం మరల మునుపటివలె మారింది. అగస్త్యుడు కాలగమనాన్ని కూడా శాసించగల సమర్థుడు.

అగస్త్యుడు చాలాకాలం బ్రహ్మచారిగా ఉండిపోయాడు. బ్రహ్మచారి గృహస్థుడు కాకుండా ఉండిపోతే అతని పితృదేవతలకు ముందుగతులు ఉండవు. ముందుగతులు లేని పితృదేవతలు అడవులలో చెట్లకు తలక్రిందులుగా వ్రేలాడుతూ ఉ ండిపోతారు. ఆ సంగతి తెలిసికొన్న అగస్త్యుడు తనకు సరైన కన్య దొరకక పోవుటచే, విదర్భరాజుకు లోపాముద్ర అను పుత్రికను తన తపశ్శక్తితో ప్రసాదించి, లోపాముద్రను వివాహం చేసకుంటాడు. ఆ విధంగా లోపాముద్రా సమేతంగా అగస్త్యుడు శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠుడు అవుతాడు. అంతటి మహిమాన్వితుడైన అగస్త్యుడు బ్రహ్మాండ పురాణమునందలి ఉత్తర భాగంలో గల 1) శ్రీలలితాదేవి మంత్రములు, 2) న్యాసములు, 3) పూజావిధానములు, 4) పురశ్చరణవిధి, 5) హోమములు, 6) రహస్యములు, 7) స్తోత్రములు అను ఏడు విషయములు హయగ్రీవుని వలన తెలిసికొనియున్నాడు. ఇంతకీ ఈ హయగ్రీవుడు ఎవరు? ఆయన సాక్షాత్తు విష్ణుమూర్తియే హయగ్రీవుడు. ఆయనకు హయగ్రీవుడు అనే పేరు ఎలా వచ్చినది? హయగ్రీవావతారగాథ దేవీభాగవతంలో ప్రథమ స్కంధము నందు గలదు. పూర్వం హయగ్రీవుడు అనే రాక్షసుడు ఉండేవాడు. గుర్రం తలను కలిగిన హయగ్రీవుడు. బ్రహ్మదేవుడి గురించి కఠోర తపస్సు చేశాడు. తన ఆకారంతో ఉన్నవారి చేతిలో మాత్రమే తనకి మరణం సంభవించేలా వరాన్ని పొందాడు. వర గర్వంతో హయగ్రీవుడు సాధు సత్పురుషులను హింసించసాగాడు. దీంతో దేవతలంతా ఆది దంపతులను శరణువేడారు. యోగ నిద్రలో వున్న విష్ణువును మేల్కొలిపితే ఆయనే హయగ్రీవుడిని సంహరిస్తాడని పార్వతీ దేవి వారితో చెప్పింది. శ్రీమహావిష్ణువు తన విల్లు చివరి భాగాన్ని గెడ్డంకింద పెట్టుకుని నిద్రిస్తున్నాడు. ఆయనను మేల్కొల్పడం కోసం శివుడు చెద పురుగుగా మారి వింటి తాడును తెంపాడు. వింటి తాడు తెగిన కారణంగా విల్లు పైకి ఎగదన్నడంతో శ్రీ మహావిష్ణువుయొక్క శిరస్సు తెగి శరీరం నుంచి వేరై పోయింది. ఆయన ఉద్దేశాన్ని అర్థం చేసుకున్న ఆది దంపతులు గుర్రం తలను తెప్పించి శ్రీ మహావిష్ణువు దేహానికి అమర్చారు. అమ్మవారితో సహా దేవాధి దేవతలు తమ జ్ఞానాన్ని.. శక్తి సామర్థ్యాలను గుర్రం తల గల శ్రీమహావిష్ణువుకు ధారపోశారు. ఆ విధముగా విష్ణుమూర్తి గుర్రపు (హయముయొక్క) శిరస్సు కలిగినవాడై హయగ్రీవుడు అయినాడు.

శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠుడు అయిన అగస్త్యుడు అప్పటికే శ్రీలలితాదేవి మంత్రములు, న్యాసములు, పూజావిధానములు, పురశ్చరణవిధి, హోమములు, రహస్యములు, స్తోత్రములు అను ఏడు విషయములు హయగ్రీవస్వామి నుండి తెలిసికొనెను. ఇంకనూ, అగస్త్యుడు ఎంతోకాలము కఠోరమైన తపస్సు చేసి తన తపోమహిమచే అంతకు పూర్వము



గర్వితుడై సూర్యగమనాన్ని
ఆటంకపరచుటకై తన శిఖరాన్ని పెంచిన
వింధ్యాద్రిని తగ్గమని శాసిస్తున్న
మహానీయుడు అగస్త్యమహర్షుల వారు



కనబడకుండా తమను హింసిస్తూ
సముద్రమునందు దాగియున్న
కాలకేయులను వెలికి తీయుటకు
సముద్రమును పుక్కిటపట్టుమని
వేడుకొంటున్న దేవతల ప్రార్థన వింటున్న
మహనీయుడు అగస్త్యమహర్షుల వారు




సముద్రమునంతటిని ఆపోశనబట్టి
దాగియున్న కాలకేయ రాక్షసులను
వెలికి రప్పించి నిర్మూలింపజేసిన
మహనీయుడు అగస్త్యమహర్షుల వారు




చొరబడి అరగకుండా సజీవుడై మునుల
ఉదరము చీల్చుకొనివచ్చి, వారు
మరణించిన పిదప వారిని ఆరగించుచున్న
వాతాపి, ఇల్వల రాక్షసులకు బద్ధిచెప్పదలచి
వారి ఇంట ఆతిధ్యము స్వీకరిస్తున్న
మహనీయుడు అగస్త్యమహర్షుల వారు

# శ్రీలలితా సహస్రనామ స్తోత్రము

## పూర్వపీఠిక - ప్రథమోఽధ్యాయః

**అగస్త్య ఉవాచ :**
**అశ్వానన మహాబుద్ధే సర్వశాస్త్రవిశారద।**
**కథితం లలితాదేవ్యాశ్చరితం పరమాద్భుతమ్ ॥1॥**

శ్రీవిద్యోపాసక శ్రేష్ఠుడైన అగస్త్యుడు హయగ్రీవస్వరూపుడైన శ్రీమహావిష్ణువుతో ఇలా అన్నాడు: ఓ సకలశాస్త్రవిశారదా! హయగ్రీవస్వామీ! అత్యంతాశ్చర్యకరమైన శ్రీలలితా పరాశక్తి మన్త్రములు, న్యాసములు, పూజావిధి, పురశ్చరణవిధానము, హోమములు, రహస్యములు, స్తోత్రములు అను ఏడు విషయములు నీచే చక్కగా చెప్పబడినవి.

**పూర్వం ప్రాదుర్భవో మాతుస్తతః పట్టాభిషేచనమ్।**
**భండాసురవధశ్చైవ విస్తరేణ త్వయోదితః ॥2॥**

అమ్మవారైన శ్రీలలితా త్రిపుర సుందరి యొక్క ఆవిర్భావము, పిదప ఆ అమ్మయొక్క పట్టాభిషేకము, భండాసుర సంహారము చక్కగా నీచే వివరింపబడినవి.

**వర్ణితం శ్రీపురం చాపి మహావిభవవిస్తరమ్।**
**శ్రీమత్పంచదశాక్షర్యాః మహిమావర్ణితస్తథా ॥3॥**

ఓ హయగ్రీవస్వామీ! సర్వ ఐశ్వర్యములకు నిలయము, సర్వశుభములకు మూలము అయిన శ్రీపురమును, శ్రీవిద్యా స్వరూపము, పరమేశ్వరియొక్క సూక్ష్మరూపము అయిన శ్రీమత్పంచదశాక్షరీ మన్త్రము యొక్క ప్రభావము, మహిమను మహత్తరంగా అభివర్ణించావు.

**షోఢాన్యాసాదయో న్యాసాః న్యాసఖండే సమీరితాః।**
**అంతర్యాగక్రమశ్చైవ బహిర్యాగక్రమస్తథా॥4॥**

స్వామీ హయగ్రీవా! న్యాసఖండములోని దేవియొక్క న్యాసములైన గణేశన్యాసము, గ్రహన్యాసము, నక్షత్రన్యాసము, యోగినీన్యాసము, రాశిన్యాసము, పీఠన్యాసము మొదలైన షోఢన్యాసాదులను విశేషించి కీర్తించితివి. అన్తర్యాగ, బహిర్యాగ క్రమాలను మరియు మహాయాగక్రమములు కూడా నీచే వివరించబడినవి.

**వివరణ:** న్యాసము అనగా వివిధ అవయవములందు దేవతలను భావనచేయుట. షోఢన్యాసమనబడే గణేశన్యాసాదులచే ఒక్కొక్క న్యాసముచే ఒక్కొక్క పుణ్యము కలిగితే, అన్ని న్యాసములు కలిపిచేసినచో విశేషమైన పుణ్యము కలుగుతుందని పండితులు చెప్పారు. ఈ న్యాసక్రమము బ్రహ్మాండపురాణముయొక్క ఉత్తరభాగములోని లలితాన్యాసఖండమున వివరించబడినది.

**అంతర్యాగము** అనగా మూలాధారచక్రమునందు ప్రారంభమై ముందు పన్ను (దంతము) వరకుగల శరీరమునందు దారము మాదిరిగా తేజస్సు ప్రసరిస్తున్నట్లు భావించుట. దీనినే మానసపూజ చేయుట అనికూడా అనవచ్చును.

**బహిర్యాగము** యంత్రము, విగ్రహము మొదలైనవాటికి వివిధ పూజాద్రవ్యములతో అర్చనచేయుట. బహిర్యాగమందు పాత్రాసాదనము అని ఒకటి కలదు. పాత్రాసాదనము అనగా పూజయందు ఉపయోగించు వివిధ పాత్రలను వాటికి నిర్దేశించిన స్థానములందు మన్త్రపూర్వకముగా ఉంచుట. బహిర్యాగమును అష్టాష్టకము మొదలైన వాటితో కలిపి చేసినచో మహాయాగక్రమము అగును. ఇక్కడ చెప్పిన అష్టాష్టకము అనగా:- దంపతులకు భోజనము పెట్టు కార్యక్రమము. దంపతులు అనగా మిథునము. ఈ మిథునములు ఎనిమిది ఉన్నవి. ఈ మిథునములే అసితాంగభైరవాది మిథునములు.

# శ్రీలలితా సహస్రనామములు

# నామక్రమ వ్యాఖ్యానము

# అమ్మవారి వర్ణచిత్రములు




ఓం ఐం హ్రీం శ్రీం
శ్రీమాత్రే నమః

0001

# ప్రథమ నామ మంత్రము

## ఓం శ్రీమాత్రే నమః

శ్రీమాత సృష్టిస్వరూపిణి, అనంతకోటి జీవరాశులకు మాతృస్వరూపిణి, లోకాలన్నింటికీ మాత. మంగళకరము, శుభములను అనుగ్రహించు తల్లి. అటువంటి శ్రీమాతకు నమస్కారము.

సకల చరాచర సృష్టిలోని అనంతకోటి జీవరాశులకు తల్లియైన జగన్మాతకు నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **శ్రీమాతా** యను మూడక్షరముల (త్ర్యక్షరీ) నామ మంత్రమును **ఓం శ్రీమాత్రే నమః** అని ఉచ్ఛరించుచూ, ఆ పరమేశ్వరిని అత్యంతభక్తి శ్రద్ధలతో ఆరాధించు ఉపాసకులకు ఆ పరమేశ్వరి తల్లియై, వారికేమి కావలెనో అవి వారు కోరకపోయినను (వారికి సకలార్థ సిద్ధిని) అనుగ్రహించును.

శ్రీ యనగా మంగళప్రదము, శుభప్రదము. **మాత** అనగా తల్లి. ఆ పరమేశ్వరి భక్తుల పాలిట సకలము శుభప్రదమొనగూర్చు తల్లి. సంకల్పించిన సకల కార్యములను మంగళకరమొనగూర్చునది ఆ జగన్మాత. అమ్మవారిని బమ్మెర పోతనామాత్యులవారు ఇలా స్తుతించారు

**ఉత్పలమాల**

***అమ్మలఁ గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె***
***ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చిన యమ్మ, తన్ను లో***
***నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా***
***యమ్మ, కృపాబ్ధి యిచ్చుతమహత్త్వకవిత్వ పటుత్వ సంపదల్.***

జగన్మాత తల్లులకే తల్లి. ముగ్గురమ్మలకు (త్రిశక్తులైన మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులకు) మూలమైనది. సృష్టిస్థితిలయలకు కారకురాలు, చరాచర జగత్తును సృష్టించి, అందు అనంతకోటి జీవరాశులను ఉద్భవింపజేసిన తల్లి. పిల్లలకు ఏమికావాలో అడగకుండానే సమకూర్చు తల్లివలె, సకలజీవరాశులకు గాలి, నీరు, కూడు, గూడు సమకూర్చు మహాజనని ఆ పరమేశ్వరి. దుర్మార్గులను సన్మార్గులనుజేసి, సన్మార్గులకు సద్గతులిచ్చి, లోకకంటకులను సంహరించి, వారి జీవములను తనలో లయమొనరించుకొనునది జగన్మాత అయిన ఆ పరమేశ్వరి. అమ్మా! యని ఆర్తితో పిలిస్తే ఆదుకొనే దయాసముద్రురాలు, కోరిన కోరికలు తీర్చు కరుణామయి. పంచభూతమలకు మూలప్రకృతి. అనగా పంచభూతములను తన నుండే సృష్టించి కల్పాంతమందు తనలో లీనమొనర్చుకొను ఆదిపరాశక్తి. సూర్యుని నుండి వచ్చు కిరణములకు, అగ్నిలోని ఉష్ణమునకు, చంద్రునిలోని చల్లదనమునకు, వాయువులోని కదలికకు అన్నిటికీ తానే కారణము. చరాచర జగత్తున అన్నిటిలోనూ తానే నిండియున్నది. జీవాత్మ, పరమాత్మలు ఐక్యమై యుండు ఉపాధికి (శరీరమునకు) కారణము తానే. ఇన్ని కారణములకు కారణమైన ఆ మాత మంగళప్రదమైనది, శుభప్రదమైనది గనుక ఆ పరమేశ్వరి **శ్రీమాతా** యని అనబడినది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలో ప్రథమశ్లోకములో ఇలా **అన్నారు:-**

***శివః శక్త్యా యుక్తో- యది భవతి శక్తః ప్రభవితుం***
***న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి।***
***అతస్త్వామ్ ఆరాధ్యాం హరి-హర-విరిన్చాదిభి రపి***
***ప్రణంతుం స్తోతుం వా కథ-మకృ్త పుణ్యః ప్రభవతి॥***

అమ్మా పరమేశ్వరీ! శివుడుకూడా శివానితో (నీతో) లేకుండా శక్తిమంతుడు కాలేడు. పరమేశ్వరి తనతో ఉంటేనే పరమేశ్వరుడు లోక వ్యవహారములు చక్కబెట్టగలడు. శక్తి (పరమేశ్వరి) లేని శివుడు అణుమాత్రమూ కదలశక్యముకాడు (శక్తి ఉంటే శివము, శక్తి లేకుంటే అది శవము). శివరూపమైన శివలింగము నీ (పరమేశ్వరి) రూపమైన పానమట్టం లేనిదే నిలబడదు. అంతటి పరమేశ్వరుడే పరాధీనుడైన నాడు సామాన్యమైన అనంతకోటి జీవరాశులు నీ (పరమేశ్వరి) యొక్క అనుగ్రహములేకుండా ఉండగలవా? ఉండలేవు. నిన్ను (పరమేశ్వరిని) నిత్యము శివుడు,విష్ణువు, బ్రహ్మ మొదలైన దేవాదిదేవతలే కొలుస్తూ ఉంటారు. అటువంటి నిన్ను (పరమేశ్వరిని) కొలవాలన్నా నీ (పరమేశ్వరి) పాదపద్మాలు సేవించాలన్నా ఎన్నో జన్మల పుణ్యం చేసినవారికి తప్ప అన్యులకు ఆ భాగ్యము దక్కదు కదా!

స్వర్గం కన్నా తల్లి మిన్న. **(జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి)** ఎన్ని భోగభాగ్యాలున్నా, తల్లి చెంతలేని ఆ భోగభాగ్యాలు వ్యర్థమేగదా! పిల్లలు లేని తల్లులు ఉండవచ్చు. కాని తల్లి లేకుండా పిల్లలు ఉండరు. పిల్లలలో మంచివాళ్ళు ఉంటారు, చెడ్డవాళ్ళు ఉంటారు. పిల్లల పట్ల మంచి తల్లి, చెడ్డ తల్లి అని ఉండదు. పరమేశ్వరికి భక్తులు ఉన్నారు. వారు కీర్తించి ఆ తల్లి సాయుజ్యం పొందుతున్నారు. అలాగే చెడ్డవారైన రాక్షసులు ఉన్నారు. పరమేశ్వరిని దూషిస్తూ, ఆమెచే సంహరింపబడి ఆమెలో లీనమైపోతున్నారు. జయవిజయులు మునిశాపానికి గురి అయారు. ఏడు జన్మలు కీర్తిస్తూ తన వద్దకు తిరిగి రావాలనుకుంటున్నారా? లేక శత్రుత్వంతో మూడుజన్మలలో తనవద్దకు తిరిగి రావాలనుకుంటున్నారా? అని పరమాత్మ జయవిజయులను అడిగితే ఏదైనా పరమేశ్వర సామీప్యమే గనుక మూడు జన్మలలో శత్రుత్వంతో తొందరగా పరమాత్మని చేరాలనుకున్నారు. అలాగే తల్లి కూడా సుపుత్రులను, కుపుత్రులను కూడా తన బిడ్డలుగానే సాకుతుంది. ఇద్దరికీ సమానంగా ప్రేమ పంచుతుంది. అలాగే పరమేశ్వరికూడా! అనంతకోటి జీవరాశులలో విషసర్పాలు ఉన్నాయి. క్రూరజంతువులు ఉన్నాయి. గోవువంటి సాధుజంతువులు ఉన్నాయి. జగన్మాతకు అన్ని జీవులు సమానమే. అందరికీ ప్రాణవాయువు, ఆహారము, సూర్యకాంతి, చంద్రుని వెన్నెల, నదులలోని నీరు, పర్వతాలలోని ఓషధులు మొదలైనవి అన్నియు అవసరం మేరకు సంప్రాప్తింప జేస్తుంది. అందుకే ఆ పరమేశ్వరి మాత. అన్ని జీవులకు శుభప్రదము, మంగళప్రదమును అనుగ్రహించు శ్రీమాత. అందుకే ఆ పరమేశ్వరి **శ్రీమాతా** యని అనబడినది.

**అ** కార, **ఉ** కార, **మ** కార సంయుక్తము **ఓం** కారము. అది సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమైన బీజాక్షరం. అలాగే **శ** కార, **ర** కార, **ఈ** కారముల సంయుక్తము **శ్రీ** కారము. **శ** అంటే శారద (మహా సరస్వతి), **ర** అంటే రమ (మహాలక్ష్మి), **ఈ** ఈశ్వరి (పరమేశ్వరుని భార్య పార్వతి) అనగా శక్తిత్రయము. ఈ శక్తి త్రయమునకు పరమేశ్వరి తల్లి వంటిది. వీరు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణిలు. ఈ ముప్పురు ప్రకృతులైతే, సత్త్వరజస్తమోగుణ మూర్తులు త్రిమూర్తులు (బ్రహ్మవిష్ణురుద్రులు) పురుషులు. వారికి వీరికీ మూలం పరమేశ్వరి. గనుకనే మాత అయిన పరమేశ్వరికి **శ్రీ** ని చేర్చి, ఆ తల్లిని **శ్రీమాతా** యని ప్రప్రథమంగా శ్రీలలితా సహస్రనామములు విరచించిన వశిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌళిని అను వశిన్యాది వాగ్దేవతలు అన్నారు.

**శ్రీ** అంటే లక్ష్మి. ముపురమ్మలలో ఒకరు. ఆమెకు మాత అయిన పరమేశ్వరి **శ్రీమాతా** యని అనబడినది.

**శ్రీ** యనునది పూజ్యుల నామములకు ముందు ఉపయోగించు శబ్దము. జగన్మాత మాత. తల్లి యంటేనే పూజ్యురాలు. సకలలోకాలకు, అనంతకోటి జీవరాశులకు తల్లి అయిన జగన్మాతను అందుకే **శ్రీమాతా** యని కీర్తిస్తున్నాము.

పరమేశ్వరుడు శ్రీకంఠుడు శివశక్తులకు భేదము లేదు గనుక అయ్యవారు కంఠుడు, అమ్మవారు మాత అలాగే అయ్యవారు శ్రీకంఠుడు, అమ్మవారు శ్రీమాత.

విషము కంఠమునందుంచుకున్న శివస్వరూపిణియైన అమ్మవారు **శ్రీమాతా** యని అనబడినది అని కూడా చెప్పవచ్చును.

వేదములు పరమేశ్వరినుండి అభివ్యక్తములైనవి. మొదట వేదము అన్నది ఒకటే. ఒకటిగా ఉన్న వేదమును ఋగ్యజుస్సామవేదములుగా విభజించిన వేదస్వరూపిణియైన పరమేశ్వరి వేదవ్యాస స్వరూపిణి యని అనిపించుకొన్నది. ఈ మూడు వేదములకు **శ్రీ** యని పేరు. అందుచే పరమేశ్వరి **శ్రీమాతా** యని అనబడినది. బ్రహ్మను సృష్టించి ఆయనకు వేదములను అభివ్యక్తము చేసిన వేదస్వరూపిణి పరమేశ్వరి గనుక, ఆ తల్లి **శ్రీమాతా** యని అనబడినది.

జగన్మాతయైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం శ్రీమాత్రే నమః** అని యనవలెను.



ఓం ఐం హ్రీం శ్రీం

శ్రీమహారాజ్ఞ్యై నమ:

0002

# 2వ నామ మంత్రము

## ఓం శ్రీమహారాజ్ఞ్యై నమః

క్రమం తప్పని గ్రహగతులు, ఋతుధర్మములు, వివిధ జీవుల శరీరనిర్మాణ వైవిధ్యములు, పదార్థధర్మములతో దక్షత గలిగిన ఉత్తమ పాలకురాలిగా, శ్రీమహారాజ్ఞిగా తేజరిల్లు అఖిలాండేశ్వరికి నమస్కారము.

అఖిలాండేశ్వరి అయిన శ్రీమాత సమస్త లోకాలను పరిపాలించు తల్లికి నమస్కారము.

శ్రీ లలితా సహస్రనామావళియందలి **శ్రీమహారాజ్ఞీ** అను ఐదక్షరముల (పంచాక్షరీ) నామ మంత్రమును **ఓం శ్రీ మహారాజ్ఞ్యై నమః** అని ఉచ్చరిస్తూ అత్యంత భక్తి శ్రద్ధలతో ఆ శ్రీమాతను ఉపాసించు సాధకులకు శ్రీ మహారాజ్ఞి కరుణతో సమస్త ఈతిబాధలు, గ్రహసంబంధమైన ఇక్కట్లు, అష్టదారిద్ర్యములు తొలగి ఐహికానంద సంబంధమైన సుఖసంతోషములు, ఆధ్యాత్మికానందమును, కార్యదక్షతను ప్రసాదించును.

తొలుత శ్రీమాత అయితే ఈనామంతో తల్లి ఆబ్రహ్మ పిపీలకాది పర్యంతమూ గల అఖిలలోకముల కన్నిటికినీ అధినేతగా సామ్రాజ్ఞిగా పాలనా భారమును వహించిన మహారాజ్ఞి మరియు శుభప్రదమైన సామ్రాజ్ఞి. శ్రీమాతగా తనబిడ్డలకు కావలసిన ఆహారమును పంచభూతములద్వారా సమకూర్చి పెంచుతుంది. బ్రహ్మోపేంద్ర మహేంద్రాదులచే సంస్తుతింపజేసుకుంటూ సృష్టి, స్థితి, లయ కార్యములందు తనదైన పరిపాలనా దక్షతనందించు శ్రీమహారాజ్ఞి ఆ శ్రీమాత. గ్రహగతులు తప్పకుండా నవగ్రహములను, ఋతుధర్మములు మారకుండా అష్ట దిక్పాలకులను, ఆజ్ఞాబద్ధతతో నియంత్రించు మహాసామ్రాజ్ఞి ఆ శ్రీమహారాజ్ఞి. ఆ తల్లి చిన్న రాజ్యానికి రాణికాదు. సమస్త అఖిలాండములకే అఖిలాండాశ్వరి ఆ శ్రీమహారాజ్ఞి. తల్లి తన బిడ్డల సౌఖ్యాన్ని కోరితే ఈ జగన్మాత సమస్త విశ్వముల శ్రేయస్సును కాంక్షించే శ్రీమహారాజ్ఞి. ఉపనిషత్తులు పరమాత్మను ప్రతిపాదిస్తూ యస్మాద్భూత నిజాయన్తే, యేన జాతాని జీవన్తి అని చెపుతున్నాయి, సముద్రములు, నదులు, గిరులు తమ ధర్మములు తప్పకుండా ఉండేవిధంగా శాసిస్తూ అమ్మ తన పరిపాలనాదక్షతతో పాలించుచున్నది. జీవుల శరీరనిర్మాణం, అవయవముల అమరిక ఒక్కసారి ఆలోచించితే శరీరంలో జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనసు తమతమ పనులు నిర్వహించడం ఆ పరమేశ్వరి పరిపాలనా దక్షతదే యగుటచే ఆ తల్లి **శ్రీమహారాజ్ఞి** అయినది. ఆ పరమేశ్వరి పరిపాలనా దక్షత గురుంచి ఉపనిషత్తులు (తైత్తరీయోపనిషత్తులో) **భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి** అని కీర్తించాయి. పరబ్రహ్మస్వరూపిణి, శ్రీమహారాజ్ఞి అయిన ఆ పరమేశ్వరి ఆజ్ఞకు లోబడి సూర్యుడు, వాయువు, అగ్ని, వరుణుడు, యముడు, ఇంద్రుడు వారికి నియమించిన కార్యములను హద్దులు దాటకుండా సక్రమంగా నిర్వహిస్తున్నారు.

ఆమె పరిపాలనలో క్రూరమృగములు, విషసర్పములు వనములు దాటి జనావాసంలో ప్రవేశించవీలులేదు. సముద్రము చెలియలికట్ట దాటి బయటకురాదు. మర్రిచెట్టుకు చిన్నకాయలు, గుమ్మడి పాదుకు పెద్దకాయలు ఉండవలసిందే. చీమకు విషము ఉండకూడదు. సాగర జలములు ఉప్పగా ఉన్నా ప్రక్కనే ఉన్న చలమలలోని నీరు అందుకు విరుద్ధంగా తీయగా ఉంటుంది. ప్రకృతిమాత సిగలో అందంగా శ్రీమాత తురిమిన పువ్వులు ఎంత సుందరము! ఎన్నిరంగులు! ఎంత సువాసన! ఆ పూలలోని మకరందము ఎంత మధురము! ఆ పూల పొందిక (ఆకారములు) ఎంత అద్భుతం! ఇదంతా తన పాలనలోనున్న ప్రతీ జీవిని ఆహ్లాదపరిచే పరిపాలనా రహస్యం. కోకిల గానంలోని మధురం ఆ తల్లి అనుగ్రహమే. చిలుకపలుకులలోని కులుకు ఆ పరమేశ్వరి సమర్పణయే. ఇదంతా ఆ శ్రీమహారాజ్ఞియొక్క పరిపాలనా రహస్యం. అందుకే ఆ పరమేశ్వరి **శ్రీమహారాజ్ఞీ** యని అనబడినది.

చిన్న చిన్న రాజ్యాలను పాలించేవారు రాజులు. అలాంటి పలు రాజ్యాలను పాలించునతడు మహారాజు. మహారాజులకు మహారాజు చక్రవర్తి. అలాగే లోకాలను పాలించే ఇంద్రుడు, యముడు, వరుణుడు మొదలైనవారు లోకపాలురు. శ్రీమహావిష్ణువు వైకుంఠాధిపతి. బ్రహ్మ సత్యలోకాధీశుడు, పరమేశ్వరుడు కైలాసపతి. ఈ రాజులను, మహారాజులను, చక్రవర్తులను, లోకపాలురను, త్రిమూర్తులను పాలించే పరమేశ్వరి మహారాజ్ఞి




ఓం ఐం హ్రీం శ్రీం

శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః

0003

# శ్రీ చక్ర యంత్రరాజము

## కాశ్మీరీ హైందవము ఆధారితమైన తంత్రములో పవిత్రమైన యంత్రం



దీని జ్యామితీయ నిర్మాణము ఒక బిందువు చుట్టూ వివిధ దిశలలో ఉద్భవించే పెద్ద త్రిభుజాల వలె ఉంటుంది. ఈ యంత్రము శక్తి స్వరూపిణులైన శ్రీ విద్య, లలితా దేవి లేదా త్రిపుర సుందరి అనే దేవతను సూచిస్తాయి. దీనిలోని నాలుగు సమద్విబాహు త్రిభుజాలు ఊర్ధ్వముఖంగా ఉండి శివుణ్ణి లేదా పురుష శక్తిని సూచిస్తాయి. అయిదు సమద్విబాహు త్రిభుజాలు నిమ్నముఖంగా ఉండి శక్తిని లేదా స్త్రీని సూచిస్తాయి. కావున శ్రీ చక్ర యంత్రము వ్యతిరేక దివ్యశక్తుల సంగమమును సూచిస్తుంది. ఇందులో త్రిభుజాలు మొత్తం తొమ్మిది ఉన్నందున దీనిని నవయోని చక్రం అని లేదా నవ చక్రం (Nava Chakras) అని కూడా పిలుస్తారు.